నారద

సీ. విధిని నిర్బంధించి వేదంబులనుగొని
సోమకాసురుఁ డబ్ధిఁ జొచ్చినాఁడు
దివిజులు దనుజు లబ్ధిని ద్రచ్చునప్పుడు
కాలకూటము భూమి గాల్చినాఁడు
ఖలుఁ డాగతాయి రక్కసి హిరణ్యాక్షుఁడే
యవని చాఁపగఁజుట్ట నరుగునాఁడు
సత్యపతివ్రతా సముతిని సీత ను
పౌలస్త్యుఁడు హరించి పాఱునాఁడు

గీ. ఎట్టికడగండ్లు ప్రజ లవు డీడ్చినారొ
తిరిగి యా యగచాటులే తెచ్చినారు
కడిచి కూర్చుండ కీకరు పుడమి పతులు
పై పయిని పోవ దీ పరాభవ దవాగ్ని.

దేవా! యదునందనా! నేను పోయెదను. అదిగో దేవేంద్రుఁడు వచ్చుచున్నాఁడు. (అని నిష్క్రమించును.)

దేవేంద్రుఁడు—(ప్రవేశించును) జయము జయము కృష్ణా!

కృ—(విదురుఁడు ఎదురుగా వెళ్లి) స్వర్గాధిపతియగు దేవేంద్రుని రాక మాకు శుభమగునుగాక. పురందరా! ఈయాసనమున నధిష్టింపుము.

దేవే—మహాభాగ్యము (అని కూర్చుండును.)

విదురుఁడు—(వనమునుండి వచ్చిన గోవులు పాలుపితికి యింద్రునకు నర్ఘ్య మిచ్చును.)

ఇంద్రు—(సంతుష్టుఁడై విదురునకు వందనముజేసి) మురానేక దుష్టరాక్షస విదారీ కంసారీ! నీవు రాయబారిగా వెడలినప్పుడు కౌరవ

సభను నడిచిన యుదంతమంతయు నారదునివలన తెలిసికొని మిక్కిలి విషాదపడితిమి. మామేనులు పులకరించినవి. సకల లోక పూజ్యుఁడవైన నిన్నట్లా కౌరవహతకులవమానపరచుట మిక్కిలి సంతాపకరము.

సీ. రాజసూయమునాఁడు రగిలిన శిశుపాలు
మస్తకంబును దునుమాడునాఁడు
పురములోపల సురాసురలు జూచుచునుండ
నరకాసురునిబట్టి నరుకునాఁడు
బాలకేళీలీల కాళిందితీరములఁ
మునియలుగాఁ గాళ్లఁ ద్రొక్కునాఁడు
స్వకులస్వరాజ్యవిధ్వంసుని కంసుని
సిగఁబట్టి వంచి సిద్ధించునాఁడు

గీ. నీమహత్వంబు లోకంబు నివ్వెరపడి
చూచి తలవంచి పూజించుచుండ నెంత
తెంపరై సుయోధనుఁడు నిన్నొంపఁ జూచె
సకట యాతనిపోఁగాల మరుగుదెంచె.

(ఆకాశముపై దేవతలు "నిజము నిజము" అని ఘోషనినాదములు సేయుదురు. పుష్పవృష్టి కురియును)

విదు — దేవేంద్రాదిదిక్పతులారా! మీానుమువు లమోఘములు.

ఇంద్రు — శ్రీకృష్ణా! ఆగతానాగతవేదివైన నీకు తెలియనియర్థము లేదు. నీవు సర్వజ్ఞుఁడవు. సర్వశక్తిసంపన్నుఁడవు. కాలత్రయము నీచేతిలో నున్నది. నేను నిన్నొకవర మడుగవచ్చితిని. అవహితుఁడవై విని ప్రసాదింపవేఁడుచున్నాఁడను.

కృ — దేవేంద్రా! నీకేమివలసిన నది భవత్ప్రీత్యర్థ మిచ్చుటకు సంసిద్ధుఁడ

నై యున్నాను. అడుగుము సంశయములేదు.

ఇంద్రు—

చ. అడవులఁ గ్రొర్లు మార్చి వ్యసనాబ్ధి దేల్చుచుఁ గుందుచున్న నా
కొడుకును నీకురంది యనుజుండగు పార్థున కీవు శ్రీఘ్రమే
ర్పడిన నిజంబుగా రిపుల భారత యుద్ధమునందు గెల్చి యీ
పుడమి యశంబు నైభవము బొందఁగలారు జగంబు మెచ్చఁగన్.

కావున నో యదునందనా! నీవు ప్రసన్నుఁడవై ధనుర్విద్యా విశారదుఁడైన నర్జునునకుఁ దోడ్పడుమనని నాకు వర మొసంగుము. వీరి రువురు కలిసి నిలిచినచో భారతమహాయుద్ధము నవలీలగ జయింపఁగలరు. వీరికి మేము బాసటయై యుందుమని మేమిరా పంచభూతములమధ్య ప్రమాణము చేయుచున్నాము.

కృ—నీ మాటదేశానుసారము నాకు మిక్కిలి వత్సలుఁడైన నర్జునునకు నేను తప్పక తోడ్పడియెదను. నీవు మాకొక సహాయము సేయ వలయును.

ఇం—అది యేమి?

కృ—కర్ణుని కవచకుండలములు ఎట్లైన మాయఁజేసి హరింపవలయును, లేకున్న నాతఁ డజేయుఁడు.

ఇం—ఆ యుపాయముకూడ నీవే చెప్పుము

కృ—నీవు భూసుర వేషమునఁబోయి యాచించిన నాతఁడు కాదన కిచ్చివేయును.

ఇం—అట్లగునుగాక. (అని అందరు నిష్క్రమించుచున్నారు.)

ద్వితీయరంగము.

(పాండవులు ద్రౌపదీసహితులై ప్రవేశింతురు.)

ధర్మ—శ్రీకృష్ణ భగవానుఁడు దుర్యోధనాదులపాలికిఁ బోయి మాకై

మేలు గడించికొని వచ్చెదనని బాసాడి వెడలి యేలకో యింకను రాలేదు. ఆమహాత్ములు హితవచనంబులు వినువారు కారు. నందనందను కేమైన కీడు లాలోచించిరేమోయని నాహృదయము తల్లడిల్లిపోవుచున్నది. నేను దేనికై వగం జెందఁగలుగుదును!

ఉ. పుట్టిన యూరిలో నిలువఁబోలదు పొమ్మనఁ బోయి యుండుచోఁ గట్టిన యూరు సొచ్చి యిది కాదని జూదము వెట్టి గెల్చి మా పట్టున నిల్వనీడయును వండఁగఁ బంచయు నీక కాననం గొట్టె సుయోధనుం డలిగి కొంటెతనంబున మేము గీట్వడన్.

భీము — అన్నా ధర్మరాజా! నీవీసంగతి ముందే యెఱింగియున్న మనకీ కీడే రాకపోయెడిది.

మ. జగడం బాడఁగలేదు కౌరవుల పచ్చన్ జూచి దుఃఖించలే దగుణంబుల్ వచియింపలే దకట మాయా ద్యూతమున్ బెట్టియిం తగలిన్ దెచ్చె సుయోధనుండు ఖలుఁడై తద్రక్తమున్ ద్రావి నా దగ చల్లార్చెద నొక్కనాఁడు కురుకాంతారంబు ఖండించుచున్.

అట్టి మేటి కాలమాసన్నమగునుగాక. దుష్టులు ప్రపంచనాటకరంగ మునుండి నిష్క్రమించెదరుగాత. ఈ పంచభూతములు ఆవిధి. ఆ సూర్యచంద్రాది దిక్పతులు నాకుఁ దోడ్డై నిలిచెదరు గాక.

అర్జు — అన్నా! నాఁటి పరాభవ మెంత మఱచిపోవుద మన్నను మఱవు రాకున్నది.

ఉ. పుట్టిననాఁటగోలె మము మొత్తి కృతాంతనిశాంతవీధికిన్ నెట్టఁదలంచి సాగక వినిందిత వృత్తి సుయోధనుండు మా పట్టు కదల్చి మా వసతిబాయఁగ ద్రౌపదినీడ్చి కొల్వులోఁ బెట్టి వివస్త్రఁజేసె నిది వీరులమార్గమె లోకమాడదే.

నకు — ఆ దుర్యోధన హతకుని లోకము నిందించిన నేమి, నవ్విన నేమి.

వాఁడు చేయవలసినంత పరాభవము చేయనే చేసినాఁడు.

ఉ. తీరని దుఃఖసంతతులదింపి భరంపడి కట్టుకొన్న నా
గారమునుండి లేపి మము కానల ద్వాదశవర్షముల్ పురిన్
బేరులుమార్చి వత్సరము వేదనలన్ బడుమంచు బంపె నా
క్రూర సుయోధనుండిపుడు కూర్చునొ లేదొ సగంబురాజ్యమున్.

సహ—అది యెవరు చెప్పఁగలరు?

చ. పుడమియు రాజ్యమున్ బయిసిపోవఁగ గోఁతులుత్రవ్వియూరిలో
వెడలిచి పట్టెడన్నమును పెట్టక దొంగల పాగనంపుకై
వడి మము నెట్టి కానలకు భ్రాతలుగామొ సగంబురాజ్య మా
కిడదగిమో రణంబునకు నీడ్చిన గెల్వఁగమొ కౌరవేయులన్.

ధర్మ—

మ. పదమూఁడేండ్లు భరింపరాని వెతలన్ బ్రాణాలుక్షోభించ నా
వదలన్ బోర్లుచు నెన్నఁడైన హితముల్ బ్రార్థించునాయంచు నె
మ్మదిలో పుట్టెడు నాస పెట్టుకొని ప్రేమన్ గాలమున్ బుచ్చుచు
న్నది యీచావది దీనిమొల్ల తుదకన్నా తీఱునో తీఱదో.

ఓపాంచాలీ యాజ్ఞసేనీ! యేల నీవీతల ముడివేయవు?

ద్రౌ—ఎట్లు వేయఁగలను.

చ. జడముడి వీడ ముంగురులు జార వివస్త్రనుజేయఁ దెచ్చిన
ప్పుడు సభలోన నేను ఇది పోలదు మీకని చెప్ప దుస్ససే
నుఁడు వినకున్న నీకడుపునున్ బెగలించి త్వదీయ రక్తమే
ర్పడఁగ బిరాన నాకురుల రాచి ముడించెదనంచు నాడితిన్.

ఆశపథ మెట్లు వదలుకొందును.

భీము—వలదు. నీవు వీడవలదు. ఆదుశ్శాసనహాతకు నట్లే కావించెద
నోపికఁబట్టుము.

ద్రౌప — నేనట్టి వేడుకఁ జూడఁగలనా ? నావేణిని ముడివైచు భాగ్య
మబ్బునా ?

భీము — చెలీ ! అటులేల శంకించెదవు ?

చ. అబలను నస్వతంత్రను పరాంగన నొండొరు లంటరాని నీ
కబరినిబట్టి యీడ్చి రిది గంబరసేయఁగఁ గట్టుచీరలన్
గబగబ వచ్చి విప్పి రల కౌరవపాంసులు భూతకోటికిన్
గబళము లైననాఁడె ముడిగట్టుము నెత్తుటముంచి నీకురుల్.

అర్జు — అగుఁగాక.

ఉ. కాలముతిప్పివచ్చినది కానలఁద్వడి పేర్లుమార్చి దుః
ఖాలకు నాలవాలమయి కష్టములెన్నొ సహించినాము మా
పాలి కనుగ్రహింప భగవంతుఁడు లేఁడె కృతాపరాధులన్
గూలిచి మాకు వేట్క లొసఁగూర్పఁడె నమ్మినవారికిపుడునే.

ధర్మ — దుర్యోధనాదులచే పరాభూతుఁడైన విదురుఁడీ సమీపాశ్రమ
మున నున్నాఁడు. వానిదర్శింపఁబోవుదము రండు. (అని వెడలు
దురు. కృష్ణుఁడును, విదురుఁడును సమీపించుదురు.)

ధర్మ — (తక్కినవారును నమస్కరింతురు.)

శా. దేవా! నీవు మహానుభావుఁడవు స[illegible]న్ నిన్ను దర్శించి యొం
తే విశ్వంబు తరించు సర్వమున నీవే యొప్పియున్నావు మా
దావాగ్ని ప్రతిమానమౌ యిడుములన్ దప్పించి రక్షింప మా
కీవేతప్ప నితఃపరంబు గలదే కృష్ణా ! జగన్నాయకా !

కృ — మీకు జయమగునుగాక.

ధర్మ — దేవా ! దేవకీనందనా ! నీవు కౌరవులయొద్దకుఁ గొంపోయిన
మారాయబార మేమైనది ? సంధియేమైన పొసఁగినదా ! మాకే
మైన గతిని కల్పించినారా?

కృ—లేదు.

ఉ. పాండవమాత యాతఁ బోకపక్షపువాఁడని రాయబార మ
బ్బుండఁగ నన్ను జూచి విరసోక్తుల నాడుచు సాగనంపిరా
యుండగు లైన కౌరవులు ద్రోహులు వారల పొత్తు మీకు ని
ట్లుండఁగఁ గూడునే తుదకు యుద్ధము తప్పదు ధర్మనందనా.

భీము—అట్లఁగాక. కృష్ణా! మంచిపని చేసితివి. నేటికి నామనోరథము ఫలించినది. ఆహా! నీవు విశ్వజ్ఞుఁడవు, సకలకల్యాణగుణాకరుఁడవు. కావున నాచేతుల తీటతీరుటకు సమయము గల్పించితివి. రణము కావలెను. కౌరవుల కావరమణఁగవలెను. మాకు స్వరాజ్యము రావలయును. ఇదే నాకన్నకోరిక.

ధర్మ—కృష్ణా! తుదకు యుద్ధమే సిద్ధమా! అయ్యో! యెంత కెంత మూఁడినది. ఇంక నే నేమి చేయను?

అర్జు—బావా! సంధి పొసఁగలేదా?

కృ—లేదు.

విదు—

ఆ. వె. కృష్ణుఁ డంతవాఁడె యేగి సంధిని సేయ
లేకపోయె నన్నలోకమందు
ఏదిసంధి జరుగు నెవరుసేయుగలారు
ఉభయులకును హానియున్న గాని.

కృష్ణు—సంధికై మిక్కిలి ప్రయత్నించితిని కాని కార్యము లేకపోయినది. విధి విధాన మనుల్లంఘ్యము. అప్రతిహతము.

భీము—ఏమీ! కృష్ణా! నే నీసంధిప్రయత్నము వలదని చెప్పలేదా!

కృ—శాంతిసహితమైన సఖ్యము సర్వశ్రేయము! రణము మారణము.

భీము—దుర్జనమారణము. దుర్నివారణము.

మ. రణమున్నన్ భయమందుచుంటిమని కౌరవ్యాధమశ్రేణితో
వినయంబొప్పఁగ సంధికై పెనఁగితో విన్నార నీమాట దు
ర్జను లాలింతురె వారినెల్ల నసిధారన్ ద్రుంచి నిర్ధూమధా
మ నిరాలంబముజేసి లోకమునకున్ మార్గంబుఁ జూపన్ దగున్.

నకు—ఈభరతవంశమహాసంగ్రామము భారతభూమిని మహాభారతమై
భాసిల్లవలసి యున్నది.

సహ—అవశ్యమీకౌరవాధములు మాక్రూరకృపాణ మహాదండవ్యా
దావాగ్నికి మిడుతలవలె మాడి బూడిదకావలసినదే.

ద్రౌప—కృష్ణా! ఆపద్బాంధవా! మాకష్టము లెప్పటికైనఁ దీరునా!
మేమీ విపత్సముద్రమునుండి తరింపఁగలమా! మాకేదిశరణ్యము.

తే. గీ. మురళిచేఁ జిగిర్చెను ఎండుమ్రోళ్లు కాని
నీదు మురళి చిగుర్పఁగా నేరదయ్యె
అటుల జగము నీచే ధన్యమై వెలార్చు
చున్న మేము ధన్యులము కాకుంటి మధవ.

కావున లోకములో మేమిద్దరమే దురదృష్టవంతులము.

ధర్మ—

మ. గురుభీష్మాది కురుప్రకాండముల సత్ కోదండపాండిత్య బం
ధురులన్ శౌర్యధురంధరుల్ బుధులు యోధుల్ వారిగెల్వంగనే
వ్వరకున్ సాధ్యమె మాకు నీదుబలమే ముఖ్యంబు మమ్మోము మే
తెఱవో చూపి సముద్ధరింపు మిఁక నీదే కృష్ణ! మాభారమున్.

కృ—(నవ్వి) మీకా బెంగవలదు.

ఉ. లీలశిఖండిభీష్ము నవలీలగురున్ ద్రుపదాత్మజుండు వా
చాలతచేత కర్ణు నలశల్యుఁడు నూర్గురుధార్తరాష్ట్రులన్
కాలునిలీల భీముఁ డరికాండముతో రణవీధి కూల్చు రా
కాలము దాపరించినది కావున ధర్మజ దుఃఖమేటికిన్.

ధర్మ—కృష్ణా ! నీసంగతియు అర్జునుని సంగతియు చెప్పవైతివి.
కృ—నీ కాసంశయము వలదు.

ఉ. ఏను కిరీటిస్యందనము నెక్కి రణావని యోధవీరసే
నానులఁ గూల్చుచున్ రిపువనంబులఁ గాల్చుచు సూత్రధారిచం
దాన సమస్త సూత్రరణతంత్రములన్ నడిపించుచుండు మీ
మానవలోకమున్ విమతమండలి నిర్వైరగంది చూడఁగన్.

ధర్మ—ఇంక మేము ధన్యులము కాఁగలము.
కృ—ఈలోఁగ నీవొకపని సేయవలెను. శల్యుఁడు మనపక్షమున రాకున్నను వారిపై పేయుండి మనపక్షము పనిచేయునట్లొడఁబరచుము. (విదురునితో) మామా ! మనము కర్ణునిపాలికిఁబోయి వానిని తిరుగఁదీయవలయును. ఇది ముఖ్యమైనకార్యము.
విదు—నిజము.
కృ—మఱియు.

మ. భగదత్తుండు ఘటోత్కచుండు విరటుల్ పాంచాలమద్రేశు లా
తెగకుఁ బోని ప్రజాప్రపంచమును ముందే వర్తమానించి యీ
జగడంబున్ నడిపింపఁగావలయు భీష్మ ద్రోణ కర్ణాదులున్
బగసాధింపఁగ వత్తురా రిపునిధిన్ బంధింప కర్జం బగున్.

(తెరపడును.)

## తృతీయరంగము.

(అంగదేశములో కర్ణునిదుర్గము.)

(శ్రుతశాస్త్రి కృతశర్మమున్నగు బ్రాహ్మణులు ప్రవేశించియుందురు.)

(తెరలో)

ఇంద్రు—"నవో నవో భవతిజాయమాన" (అని చదువును.)

(అది బ్రాహ్మణులు స్వరయుక్తముగాఁ జదువుదురు.)

(తెరలో)

ఒరే కంక ! స్వరము తప్పినదిరా.

శృతి—స్వరము తప్పితే చావే.

కృత—అది నీవే.

శ్రు—స్వరము బ్రహ్మకు రాకపోగా విఘ్నేశ్వరుఁడు సుశిక్షితుని గావించినాఁడు. స్వరము వేదమునకు ప్రాణము.

కృత—ఎన్నిపనసలైన పీల్చి పిప్పిచేయుదునుగాని నాకాస్వరము రాదండి.

శృతి—ఏమిటి! పనసలు పీల్చి పిప్పిచేయుదువా! ఎంతసేపు ఏడ్చినా తిండికేగదా!

కృత—ఏడ్చినావు నోరుమూయి.

శ్రు—నాతో నీవేప్పుటకైన పనికిరావు.

కృత—అగునది-నిజమే.

శ్రు—నీకేఁక చదువేమిటిరా! నీవు తిండికి తిమ్మరాజువు, చదువునకు పోతురాజువు.

కృత—చదువు నాకుఁగాక నీకా? ఒట్టి విశవచదువు చదివితే లాభము లేదు. తెలివి యుండాలి.

శృ—ఏది. జట, ఘన చెప్పుము.

కృత—జటవేయుటకు ముందు నీజుట్టు పాయలు గావలయును. తరువాత ఘన, అఘన వాయించి చెప్పెదను.

శ్రు—నీతెలివి మండినట్లే యున్నది.

కృత—దీపము మండితేనేగాని కాంతి ప్రజ్వరిల్లదు. అట్లు తెలివి మండితేనేగాని తేజము బయలుపడదు. ఒట్టిపరమశుంఠవు, నీకేమి తెలియును? ఏది యొకపాట హాయిగ పాడుము చూచెదను.

శ్రు—నంతచెప్పుకొనేవానికి పాట యేమిటిరా !

కృత—ఆసంతపాటే పాడుమన్నది.

శ్రు—సంతపాఠేమిటిరా! పీనుఁగా వేదమువల్లె వేయుటకు సంత చెప్పు కొనుట యని యందురు.

కృత—నేనన్నదియు నదే. నీ కర్థముగాక మొత్తుకొనుచున్నావు. ఏది నీస్వరము చక్కఁగానుండు ననుచున్నావు. ఏదేని యొకటి పాడి వినిపింపుము.

శ్రు—నాకు నీపాటలు చేతగావు. పాటలుపాడి భిక్షాటనము సేయుదువా యేమి?

కృత—ఏదైన విద్యయే "కోటివిద్యలెల్ల కూటికొఱకె"

(అని లయవేసి పాడును.)

శుద్ధి—అదే గురువుగారగు దేవేంద్రభట్టుగారు వచ్చుచున్నారు.

ఇంద్రు—(ప్రవేశించి) ఓరి వెధవాయి అదేమిపాటరా!

కృత—పాటకాదండి. వీడిమాటకు సమాధానము.

ఇంద్రు—

"కేవలం లౌకికం గానం నకుర్యాత్ మోహాతోపివ
అథ కుర్యాత్ ప్రమాదేన ప్రాయశ్చిత్తీ కురుద్విజ."

కావున గానము ప్రమాదవశముచేఁ జేసినను బ్రాహ్మణునకుఁ బ్రాయశ్చిత్తము తప్పదు.

శుద్ధి—అయ్యా! వీఁడు సరస్వతీబ్రాహ్మణుఁడు కాఁబట్టి ప్రాయశ్చిత్త మక్కరలేదు.

కృత—(స్వ) సరస్వతీబ్రాహ్మణులు చేపలు తిందురని నన్నితఁ డధిక్షేపించుచున్నాఁడు సరే. నేను దానికి సరియైన సమాధానము చెప్పెదను.) ఒగే శ్రుతశాస్త్రి! నన్ను నీవు సరస్వతీబ్రాహ్మణుఁడని గదా అన్నాఁడవు. అయ్యా! గురువుగారు! వీఁడు నాకు వంటబ్రాహ్మణుఁడు. (శ్రుతశాస్త్రితో) ఒరే నీవన్నదానికి సరి పోయినదా!

ఇంద్రు—బ్రాహ్మణులలో నిన్ని భేదము లెక్కడున్నవిరా! "బ్రాహ్మణోస్యముఖమాసీత్" బ్రాహ్మణులు బ్రహ్మముఖమునందు పుట్టినారు.

శుక్రి—ఏఁడు సరస్వతీముఖమునందు పుట్టినాఁడు. కావుననే సరస్వతీ బ్రాహ్మణుఁడైనాఁడు.

కృత—ఏఁడు అన్నపూర్ణాదేవిచేతిలోఁ బుట్టినాఁడు కావుననే వంట బ్రాహ్మణుఁడైనాఁడు.

ఇంద్రు—(స్వ) నేను దేవేంద్రుఁడను అదిగో! యెవఁడో బ్రాహ్మణుఁ డీ వంకకే వచ్చుచున్నాఁడు. వీనివలన కర్ణుని యునంతమంతయు తెలుసుకొనవలయును. మహానుభావుఁడైన శ్రీకృష్ణుఁడు నాప్రియ పుత్రుఁ డర్జునునకై కర్ణుని సహజకవచకుండలములు సంపాదింపు మని యానతిచ్చినాఁడు. నేనెట్టులనైన నాతనికోర్కెఁ జెల్లించుటకై యీబ్రాహ్మణవేషమున నిచ్చటకు వచ్చితిని. నాయత్నమున కీశ్వరుఁడు తోడ్పడవలయును.

(ఆకాశవాణి) తథాస్తు.

వ్యాఘ్రిభట్టు—(ప్రవేశించి) ఎవరీ బ్రాహ్మణోత్తములు.

ఇంద్రు—మీ కెవరు కావలయును

వ్యా—ఏయూరయ్యా మీది

ఇంద్రు—మాది అమరావతి.

వ్యా—ఎందు బోయెదరు?

ఇంద్రు—ఇక్కడ యేదాతనైన నాశ్రయించాలని బోవుచున్నాము.

వ్యా—మీ రేమి పండితులా ఏమి? ఏదీ మీపాండిత్యము. "అణోరణీయాన్ మహతోమహీయాన్ ఏషో.ఽఽత్మా" దీనికర్థము చెప్పుము.

ఇంద్రు—అపరమాత్మ అణువునకంటె అణుప్రమాణుఁడున్న,

వ్యా—అది గాదయ్యా దాని యర్థము. నీవు చెప్పునది వేదాంతార్థము, మాకిప్పుడు లౌకికార్థము కావలెను.

ఇంద్రు—లౌకికార్థ మనఁగా?

వ్యా—శబ్దార్థము. శబ్దములు శబ్దములవలె నుండఁగనే యీపదచ్ఛేదముతో నర్థము సాధింపవలయును. ఇదిగో! నేను చెప్పెదను చూడుము. సంతర్పణాదిశ్రాద్ధాన్నభోజనసమయములలో 'అణో' వడ్డించే శాల్యన్నములో 'రణీయాన్' ఉద్ధరిణితో నెయ్యి 'మహతో మహీయాన్' మహిమపుత్రులకాయలకంటె పెద్దవైన బూర్లవఱకు 'ఏషోఽక్షర' వేసేవాఁడేనురా 'ఆత్మ' తనవాఁడు.

కృత—కానివాఁడు.

వ్యా—కానీ కైనఁ గొఱఁగానివాఁడు.

ఇంద్రు—ఈయర్థ మెక్కడ నేర్చికొంటివయ్యా!

వ్యా—ఇట్టి సమయానుకూలమైన మహదర్థములు సాధించువారికే రాజగౌరవమును అసూయాధికమైన పండితబిరుదానములును జాంబూనదతాంబూలాదిసత్కారములును తఱుచు జరుగుచుండును.

ఇంద్రు—అపండితులకు సన్మాన మేమిటి?

వ్యా—ఇప్పుడు జరుగుచున్న సన్మానములలో మూఁడువంతులపండితులకే నిజమైన విద్యాసంపత్తిగలవారికి ఆశనం నాస్తి.

ఇంద్రు—ఆహా! రాజాస్థానముల పండితులకుఁగూడ చోటానంగునా?

వ్యా—కుక్కలకు కోళ్లకు కులటలకు చోటు గలుగఁగాలేనిది కుకవులకు కుపండితులకు కుచ్ఛితులకు లేకపోవునయ్యా? వారికే నిక్షేపావకాశములు విలువైన బహుమానములు.

ఇంద్రు—ఇది సరికాదని మంత్రిపురోహితులైన చెప్పరా!

వ్యా—వారలువట్టి వెధవలండి.

ఇంద్రు—విధవలు స్త్రీలయందుందురుగాని, పురుషులయందెట్లుందురు?

వ్యా—ఉందురు. విధవయనఁగా ధవుఁడులేనిది అనేకధవులు గలిగినది. అది పురుషపరమైనప్పుడు ఒకరాజు పోయిన మఱియొకరాజును కొలుచుచు కుక్షి నింపుకొనువారని భావము.

కృత—ఈతఁడు మిగుల గట్టివాఁడునోయి.

శ్రుత—అగును నీవంటివాఁడే.

కృత—నావంటి బ్రహ్మాండమానముగాఁడు. కానుంతఉప్పుపత్రియున్నవాఁడే.

శ్రు—మీపేరేమండి బాబు.

వ్యా—వ్యాఘ్రభట్టంచారు.

కృత—మీరే యాస్థానకవిపుంగవులు.

వ్యా—నేను దానమునకు దిగంతవిశ్రాంతమహాకీర్తినడసిన కర్ణునియాస్థాన వికటకవిపుంగవుఁడను.

కృత—ఆహా! ఏమి మీయదృష్టము.

శ్రుత—(స్వ) కర్ణునియాస్థానమునఁ గవియన్న నదియొక ఘనమైనసంగతి గాదు. ఈతఁడాతనియొద్దకుఁబోయి నేను కవి నని చెప్పుకొని యుండవచ్చును. సహజదానశీలుఁడైన యాతఁడు వరే యని యింతభుక్తికి దినభత్తెమో నెలభత్తెమో పడవేయుచున్నాఁడు కాఁబోలును.

కృత—మీ రక్కడచేయుపని యేమండి భట్టుగారు.

శ్రు—తమ ప్రజ్ఞావిశేష మొకింత చెప్పుదురు! చెవుల తుప్పయిన వదలి పోవును.

వ్యా—ఇంచుమించు అట్టిదే నేను తఱుచు కోటలోనికిఁ బోయి రెండు మాటలు చెప్పి నాల్గు పాటలు పాడి ఓనవటకముచేయుచు అందు

న్నవా రందఱికి చక్కిలగింతలు పెట్టినను కాని నవ్వును రివ్వున
గాలికెగిరివచ్చు సముద్రపు కెరటములవలె తంగుతంగున తెప్పించి
ప్రక్కలు చెక్కలగునట్లు చేయుచుందును ఇందులో నాప్రజ్ఞ
అద్వితీయము అనుపమానము.

ఇం—అమహారాజు మీకేమైన బహుమానము లిచ్చుచుండునా?

వ్యా—వాటికి లోటుమియు లేదుగాని దాసదాసీపరివేష్టితమైన నాకోట
లోనివారందఱు నన్ను చూడఁగనే యేదో మిషపెట్టి చక్కఁగా
చాగుణింత నిరంతర పారాయణము చేయుచుందురు.

కృత—(శుశ్రీతా స్త్రీతో) అనఁగా నేమిటిరా!

శు—చాగుణింత మనఁగా చీవాట్లు, చెప్పులు చీచీలు చెంపకాయలు.
ఇత్యాదికములు వింటివా!

కృత—సరి.

ఇం—అట్లనా! నాయనా నీవింత ఘనుఁడవా!

వ్యా—నాఘనత సహజమైనది. కర్ణునకు దానము, కుంభకర్ణునకు నిద్ర,
రాజ్యార్ణవమేలిన రామచంద్రునకు కోదండపాండిత్యము, అగ్ని
లోని యుష్ణత. మసిబొగ్గులోని నలుపు ఎట్టిదో అట్టిది. మేము
బహుళపక్షములోనివారము.

శ్రు—(స్వ) ఈతఁడికి మాటలను పట్టుకొన్న జువ్విచెట్టు తాటిచెట్టును
పట్టుకొనినట్లే వదలునట్లు తోఁచదు.

కృత—అటులైన మీరు విదూషకు లన్నమాట.

ఇం—కవి నని చెప్పినారే!

వ్యా—అగును నేను కవిని.కవికి విదూషకునకు చుట్టరికము లేకపోలేదు.
విదూషకుని పని హాస్యము హాస్యము నవరసములలో నొకటి
దాని నేనాశ్రయించితిని కావున విదూషకుఁడను గాయకుఁడను

కూడ కాకపోను. నాకీవిశ్వమునం దన్నిచోట్ల స్థలమున్నది. నే నొకప్పుడు చీమనై బెల్లమును పట్టుకొనుచుందును వెంటనే గరుత్మంతుఁడనై యాకసమున కెగిరి పోవుదును. నక్షత్రము లలోఁ గలిసి ఉల్కాపాతమై నేల పడిపోవుదును. అర్థరాత్రిమున కూయు దివాంధములు నాచుట్టములుకాని నేను మాత్రము కోకిలమును.

ఇంద్రు—మీరు చాల ఆత్మస్తోత్రపరాయణులవలె నున్నారే.

వ్యా—ఎవరును స్తోత్రముచేయనివారి కాత్మస్తోత్రము స్వహస్త పాకము వంటిది. మిగుల సుకరము సౌలభ్యము.

తే. గీ. కాకములమధ్య గూర్చుండి కోకిలంబు
పాడియేగద ఘనకీర్తి పడయుచుండు
ఆకసముపైని మేఘంబు లావరించి
యురిమియేగద ఘనకీర్తి పరగుచుండు.

నే నట్టివాఁడను.

ఇం—నే నట్టివాఁడను నిట్టివాఁడ ననుటలో విశేషములేదు. త్యాగము చేతను సుగుణ సంపత్తిచేతను మనుజుని యోగ్యత తెలియ వలయును.

తే. గీ. దీపములు స్వయం దగ్ధమై దీప్తినొసఁగు
సాంబరాణి కాలుచు సువాసనలు జిమ్ము
పూలుతుంపఁగఁబడి మోదమును ఘటించు
ప్రేమ యెద యేర్చి యొరు వలపింపనేర్చు.

బ్రాహ్మణవటుఁడు (ప్రవేశించును) శ్రాద్ధాన్నభోజనములు సురా పానములు సదసత్పదార్థములవంటి పరిభాకరభాలు తమ తతర్క వితర్కపాకములలో లెక్కించవలసినవిగాని సామాన్యములుగావు ఒక

పూట శ్రీద్ధాన్న భోజన మొక సంవత్సర మారోగ్యమును చెఱచి
వైచును సారాసేవన మాయువునకే వేరుపురుగు. ఇందులో
రెండును మనోహరములైనవే కాని రెండును హానికరములనుటలో
నిర్వివాదము. అసత్యును గ్రోసిసత్తు నాశ్రయించునట్లు శాస్త్రకారులు
సారాలను నిరసించినను శ్రాద్ధములను నిరసింపలేరు. వేదములో
అన్నం బ్రహ్మమని చెప్పి ఆయన్నమే ప్రాణాలు తీయునని "అన్నం
ప్రజంత్యభిశంవిశంతి" అనిచెప్పినాఁడు ఆయవస్థయే నాకు వచ్చినది.

శ్రోత—ఏమయ్యా అట్లు త్రేన్చుచున్నావు.

వ్యా—ఈవేళ కర్ణమహారాజుగారి యింట సంతర్పణము. దిట్టముగా
తిని త్రేన్చుచున్నాఁడు. ఈ తిండిపోతులకు రెండవపని యే
మున్నది.

బ్రా—ఏమయ్యో వ్యాఘ్రిప్పా అట్టి పోతుపెంటి అనినావంటే నీయా
బోరు దక్కదు చూడు. నాముండఱ నీవు వ్యాఘ్రప్పవుగావు
శునకప్పవు జాగ్రత.

వ్యా—(స్వ) ఈ అగరాయినుండి మనము తప్పుకొంటేనే బాగుం
టుందని తోఁచుచున్నది.

ఇం—అంత యెక్కువ తినకపోయిన నేమాయెను!

బ్రా—ఏమాయెనా! నీకు సంగతి తెలియదు.

వ్యా—అగు నది నిజము.

తే. గీ. దానకర్ణుని నిజదయాదరము నిట్టి
దట్టి దనఁగ తిన్నేతున్న కలవిగాదు
ఒక్క కబళంబు దినుటకు నోపనట్టి
వాఁడు కుంచెడన్నము దిని వచ్చుచుండు,

శ్రోత—బ్రాహ్మణునకు కుంచెడన్నమొక లెక్క.

వ్యా—ఘృతసూపములలో మఱికొన్ని కంచము లగును.

ఇం—కర్ణునివంటి దాత లింకెవరైన నున్నారా?

వ్యా—లేరు ముందు పుట్టఁబోరు

సీ. అడుగ వచ్చినవారి కఖిలార్థము లొసంగి
యాదరంబున సాగ నంపుచుండు
దూర్వాసుఁ డడుగఁగా దుర్గంబు వడఁద్రోసి
వంటకట్టెలకిచ్చి పంపినాఁడు
అక్షయధన మొక్క భిక్షుకునకు నిచ్చి
పంచుకొండని దయఁ బంచినాఁడు
ఎవ్వరే మడిగిన నిచ్చెదనని తన
పట్టణంబున గంట కట్టినాఁడు

తే. గీ. దాన కర్ణుండు విజ్ఞాన ఘనుఁ డుదీర్ణుఁ
డతని త్యాగంబు బలి దధీచ్యాది పూర్వ
దాతలకు మించిపోయె మందరము గిరుల
నన్నిటికి మించి కాంతి వెలార్చినట్లు.

బ్రా—ఎవరో చండాలురు వచ్చుచున్నారు. నేను పోయెదను. (అని నిష్క్రమించును.)

సజాతుఁడు—(ప్రవేశించి) నాకే నిజముగా శాపానుగ్రహ సమర్థత యున్న నీదాతలచేతులు మూతులు వంకరలు పోవునట్లుగా శపించియుండకుందునా!

తే. గీ. తోఁక ముందును నావెన్క మేఁకపగిది
పేరునకు ముందు దాతయన్ బిరుదువెట్టి
పిలుచు కర్ణువేఁడఁగ వెంట్రుకల నొసంగె
నిట్టి దాతలు మనభూమి పుట్టినారు.

ఇం——ఏమి నీయుదంతము?

సుజా——నాయుదంతమా! ఏమున్నది! నేను కవిని విదూషకుఁడను పండితుఁడను గాయకుఁడను నానారాజ సందర్శనము చేసి మహాభాగ్యములఁ బడసిన ధీశాలిని దానమునకు మహా ఖ్యాతిఁగాంచిన కర్ణమహారాజునుబోయి యాచింపఁగా చటుక్కున నిన్ని వెంట్రుకలు దీసి నాచేతిలోఁ బోసినాఁడు. ఇట్టి శరులను నే మనవలయునా? యని నాలో నేను వగచుచు నాపాత్రమును దిట్టుకొనుచు వచ్చుచున్నాఁడను.

ధన——(ప్రవేశించి స్వ) అబ్బో అబ్బో! ఎందఱుబావన్నలుమూఁగినారు. కాకులవలె కట్టన్న బుట్ట బుట్టన్న కట్ట అని అఱచుచు మీాన మేషాలు లెక్కించుచు తక్కులాడుచున్నారు. ఇట్టి సమయములో మెల్లగా వీరలను బుట్టలోపెట్టి ఆనన్నముగా పొడుగుగా రివటపాయలాగున్న నల్లబావనోడియొద్ద నున్న కర్ణుఁడుగారి వెంట్రుకలు సంగ్రహించవలెను. వెంట్రుకకొక వెయ్యి వరాలిచ్చెదమని చాటించుచున్నారు ఆచాటింపు వీరు వినకముందే మనమా వెంట్రుకలు లాగివేయవలెను. (ప్ర) ఏమండోయి శాస్త్రులుగారు దండాలు దండాలు.

వ్యా——ఓహో! ధనగుప్తుఁడు వచ్చినాఁడు.

ఇం——శుభంభవతు.

సుజా——ఏల వచ్చితివి?

ధన——నేను వర్తకుఁడను కొనుటయు అమ్ముటయు నాపని కొనువారిచేత అమ్మించెదను, అమ్మువారిచేత కొనిపించెదను, నాశక్తి మీాకు తెలియదు.

ఇం——అది యెట్లు కొనువారు కొందురు అమ్మువారు అమ్ముదురు కాని కొనువారు అమ్ముటయు అమ్మువారు కొనుటయు నెట్లు సంఘటించును,

ధన—గిరాకీ అట్టిది.అది మాచేతిలో నున్నది. అది పరసువేది అది యెదురు తిరిగిన కాలాగ్నికంటె తీవ్రముగా ప్రజను మాడ్చివేయును.

ఇం—అనఁగా

ధన—బాబు అది వ్యాపారరహస్యము. మే మొకప్పుడు బంగారము పెట్టి వెంట్రుకలు కొందుము ఒక వెంట్రుకకొక బంగారపు కొండ సంపాదించెదము.

సుజా—ఏమోయి శెటీ! నాయొద్ద వెంట్రుకలున్నవి కొనెదవా!

వ్యా—వెంట్రుకలు లేనివా రెవ్వరు.

ధన—అవే మాకు కావలెను. తప్పక కొనెదను. మాచిన్నబ్బికి గొంగళి కావలెనని నన్ను వేపుకొని తినుచున్నాఁడు. కాశ్మీరమునుండి తెప్పించిన సేలువ కప్పుకోరాదాయని యెంతచెప్పినను వినక నాకు గొంగళే కావలెనని యేడ్చుచున్నాఁడు. గొంగళియు శాలువయు రోమ మయమేగదా! యని పరువునకు లోటున్నను సరుకొక్కటే కావున నొక కంబళి నేయించుదుమని బయలుదేరి నాను. బాబు మీయొద్ద యెన్ని రోమము లున్నవి!

కృత—ఇదిగో వీఁడి తలనిండా మెడనిండా రోమములే యెన్ని కావలసి నను సందేహము లేకుండఁగ నూఁకలాఁగవచ్చును.

శ్రుత—వీఁడును నావంటివాఁడే.

సు—మీరందరు వెంట్రుక లిచ్చిదాతలు కాఁదలంచినారా!

ధన—బాబు నే నవి డబ్బిచ్చియే కొనెదను.

సు—నాయొద్ద గుప్పెడు వెంట్రుక లున్నవి. ఎంతకు కొనెదవు?

ధన—తులములలెక్క నిచ్చెదరా లెక్కపత్రికార మిచ్చెదరా!

సు—నీవే యడుగుము.

ధన—నాది టోకుబేరము.ఇదిగో యీసంచినిండ స్వర్ణదీనారములున్నవి యివి పుచ్చుకొని మీచేతిలోని వెంట్రుక లిచ్చివేయుఁడు.

సు—మహాభాగ్యము (అని యిచ్చి సంచి తీసుకొనును.)

ధన—దిక్కెనదిరా లచ్చి (అని పోఁబోవును)

సు—(పిలిచి) ఓచేరీ! ఆనెంట్రుక లీవరాల విలువచేయునవు నీయొద్ద నన్యాయముగా నింతధనము తీసికొనుట యధర్మము గావున నీసంచియు నీవే గొనిపొమ్ము.

ధన—ఇంకేమిబాబు తమరు ధర్మప్రభువులు (అని నిష్క్రమించును.)

మాతంగుఁడు—(డప్పువాయించుచు) కర్ణమహారాజుగారి కేశములు కోశాగారమున నొక్కొక్కటి యొక్కొక్క వేయిదీనారములకు కొనఁబడును గావున కలవారు వెళ్లి మార్చుకొనవచ్చును.

(డప్పు)

వ్యా—చిత్రము చిత్రము ధనగుప్తుఁడు మోసముచేసి పాపము పేదబ్రాహ్మణుని నోట కరక్కాయ కొట్టి పోయినాఁడు.

ఇం—ఈతనికి ప్రాప్తములేదు.

తే. గీ. లచ్చి కేశరూపము దాల్చి వచ్చిపోయె
పోల్చలేక పోయితివింక పొగులనేల
ధరణి మదదృష్టవంతుఁ డెంత మిడికినను
ప్రాప్తమునకంటె నధికంబు బడయఁబోఁడు.

సు—ఆర్యులారా! నన్నా వైశ్యుఁ డన్యాయముగా మోసగించి పాఱి పోయినాఁడు.

శ్రు—అగును వాని వెంబడించి పట్టుకొని తగిన శాస్తి చేయవలయును.

కృ—ప్రస్తుతము మన కక్కడ నాస్తియైనది సరే పదండి పోవుదము.

ఇం—(స్వ) ఆకర్ణుఁ డెంత మహాదాత యిట్టి మహామహులయొద్ద నాపాసిక సులభముగ పాఱుట కభ్యంతర మొండను. నే నెంతయు ధన్యుఁడను. (అని అందరు నిష్క్రమింతురు.)

# మహాభారతకౌరవరంగము.

## తృతీయాంకము.

### రంగము — గంగాతీరము.

(శ్రీకృష్ణుఁడు, విదురుఁడు, ప్రవేశించియుందురు.)

కృష్ణు — మామా! ఈగంగ యెంత రమణీయముగఁ దోఁచుచున్నది.

విదు — ఇది ఉపస్నమయముగదా!

కృ — అగును.

సీ. శివజటాజూటంబు నవఘళింపఁగ గజ్జె
లందెలుమ్రోయ నాట్యంబు సలిపి
హిమవన్నగంబున నింపు సొంపారఁగా
స్వైరవిహారంబు చక్కఁబెట్టి
వారణావతమునఁ బాదంబు మోపి స్వై
కతసీమలను చెరగాటలాడి
దారుకాననమధ్యఁ దపసి కన్యలఁగూడి
సొమ్ములనొడ్డి నెత్తమ్ములాడి

తే. గీ. గొల్ల చేడెలుగొల్వ వ్రేపల్లెనుండి
ఇచట నావేణునాద మాలించు కొఱకు
వచ్చుచున్నది గంగప్రవాహ వేగ
వీచికలదోఁగి యానంద విభవమంద.

విదు — కృష్ణా! జీవనాధారమైన నీమొకు వేరుగ బహూకరింపవలయునా!
నీదర్శనమే మహాభాగ్యము.

తే. గీ. మొదట నీపాదకమలమందుదయమంది
శివజటాజూట మెక్కి వచ్చినదిగంగ
తిరిగి నీపాదసన్నిధి కరుగుదెంచె
సహజమార్గ కముగాదె జన్మభూమి

కృ—అదిగో మన కబురు విని కర్ణుఁ డీదారినే వచ్చుచున్నాఁడు.

కర్ణుఁడు—(ప్రవేశించి) సంధ్యానుష్ఠానార్థ మీగంగాతీరంబునకు వచ్చిన నన్ను ఎందుకో కృష్ణుఁడు కబురంపినాఁడు. అతఁడును విహారార్థ మీప్రాంతమునకు వచ్చియుండునో పోవుదుకావునపోయి దర్శించెదను.

కృ—(వినయసహిత మెదురేగి) కర్ణా! ఈ యుచితాసన మలంకరింపుము.

కర్ణు—మహాభాగ్యము (అని కూర్చుండును)

కృ—కర్ణా! నీకవచకుండలము లేమిచేసితివి?

కర్ణు—అడుగవచ్చిన ఇంద్రునకు దానము చేసితిని.

కృ—అర్థవంతుఁడైన ఇంద్రునకు దానమేమిటి అది యపాత్రదానముకాదా?

కర్ణు—కానిమ్ము. అర్థవంతుఁడైనను అర్థహీనుఁడైనను యాచించి నన్ను మున్నది చ్చుట కేలసంశయించవలయును? కావుననే నాకవచకుండలము లిచ్చివేసితిని.

కృ—అవి నీప్రాణములకంటె ఘనములు కావా?

కర్ణు—ప్రాణమడిగినను నిచ్చివేయుదును. ఇచ్చువాని కధికము నీచమను నవిలేవు.

తే. గీ. వార్థిరత్నాలు గైకొను వానికిచ్చు
భుజము ఫలములన్నిటికోసి కొనఁగనిచ్చు
సతులు దేహీయటన్న భిక్షము లొసంగు
దాత గడియించి యదుగుపేదలకుఁ బెట్టు.

విదు——ఇంద్రుఁడు పేదవాఁ డెట్లగును?

కర్ణు——అన్నము మ్రింగుచుండువాఁడు క్షుదాతురుఁడని చెప్పుట యెట్లో యాచకుఁడు పేదవాఁడని యనుటయు నట్లే.

విదు——ఇంద్రుఁడు తనయాత్మజుఁ డగునర్జునునకు మేలు సేయఁదలంచి నిన్ను వంచించినాఁడేగాని వేరుగాదు.

కర్ణు——ఆహా! యింద్రుఁ డెంతమోసగాఁడు.

తే. గీ. కోడియై గౌతముని పువ్వుఁబోఁడిఁగూడి
పాడుగాఁ జేసికొన్నాఁడు నాఁడు తనువు
నేఁడు కవచకుండలముల నృతముచెప్పి
తీసికొన్నాఁడు దుష్కీర్తి దిశలు నిండ.

కృ——అవి తిరిగి కావలె నని యెదవా?

కర్ణు——ఇసీ! అవి యేహ్యములు కావా! పాము కుబుసము విడిచినట్లప్పుడే వానిని నేను పాఱవేసితిని.

కృ——కర్ణా!

ఉ. దాతవు వేదశాస్త్రచయధర్మవినేతవు బ్రహ్మతత్త్వవి
జ్ఞాతవు కామముఖ్యరిపుషట్కవిజేతవు సర్వలోకవి
ఖ్యాతవు నీ యశోంగన దిగంతకరీంద్రశిరంబు లెక్కి కా
లూతగ నృత్యమున్ సలుపుచున్నది నీ కుదెభాగ్య మర్కజా!

కర్ణు——ఈ చరాచరజీవరాశులన్నియు పర్ణనాతీతుండవైన నీ తరువాతనే గదా! అస్మదాదుల లెక్కయేమి కృష్ణా! నన్నిప్పుడు కబురు పంపిన పనియేమి?

కృ——నీతో కొన్ని రహస్యములు ముచ్చటించవలెనని తలంచితిమి.

కర్ణు——ఆ నిగూఢవిషయము లేమో నిర్వచింపుఁడు.

విదు——నిన్ను పాండవులపక్షమునఁ బిలువవలయు ననునది యొక విషయము.

కర్ణ—అది విషయమే. ఎన్నఁటికిని పొసఁగునది గాదు.

ఉ. చుట్టము కాకపోయినను జుట్టముకంటెను వేయిరెట్లు నా
పట్టున నాదరించుచు శుభంబులఁ గూర్చుచు నంగరాజ్యమున్
బట్టముగట్టినట్టి నరపాలు సుయోధనుఁ బాసి కుంతికిన్
బుట్టినవారి పక్షమునఁ బోయి కృతఘ్నుఁడ నౌటఁ బోలునే.

కృ—కర్ణా! వదాన్యచరితుఁడ వైన నీకు తెలియని యర్థములేదు గాని నీవు దుర్యోధనాదులచే నేమేమో గొప్పగౌరవమునకుఁ బాత్రుఁడ వైనాఁడనని పలుకుచున్నాఁడవు. నీవెవరియొద్ద నున్నను నిట్టి మహనీయమైన పదవి నందవలసినవాఁడవే.

విదు—అగును. సందేహ మేమున్నది?

తే గీ. శుక్తిగర్భంబులో నున్న మౌక్తికంబు
రాలగనులందుఁ బడసిన రత్నచయము
అగతలంబున దొరకిన హాటకంబు
పృథుకిరీటముల నలంకరింపఁ బడవె.

కృ—కాని, కర్ణా! నీవు నేఁటివఱ కెవరియెడ నఖండమైన కృతజ్ఞత గలవాఁడవై మెలఁగుచు ప్రాణమైన దారవోయ సమకట్టి యున్నాఁడవో అట్టి కౌరవులు నీయెడ నిసుమంతయు గౌరవ ముంచినట్లు తోఁచదు.

విదు—అగును.

కృ—

మ. గురుభీష్మాదులు నిన్ను క్షుద్రుఁడని సంకోచింపకే చెప్పుచుం
దురు నిన్ మోఘునిగాఁ దలంపరు దురుద్యోగంబునన్ నిన్ను న
ర్ధరథున్ జేసిరి పోరునందు శరసంధానంబు మోక్షంబు నే
మఱెదంచున్ శపియించినారు మఱి నీ మర్యాద పాటించిరే.

కర్ణు—కృష్ణా! నీ వన్నది నిజము. కాని వారితో నాకేమిపని. నాకై దురాగతములు చేసినవారిలో నామైత్రిక కేమియు ప్రసక్తి లేదు. నాజవసత్త్వములన్నియు నా ప్రభువగు సుయోధనుని కూర్పుటకై యున్నవి గాని నాకందు స్వార్థ మావంతయు లేదు.

ఉ. ఏను నదీవిధానఁ బ్రవహింతును నగ్నివిధాన రాతు ఝం
ఝానిలమట్లు లోకమున సాగెద భూమివిధాన నుండెదన్
గాని ననున్ మలీమసముగా నొనరించి; నాప్రివేసినన్
మానినఁ ద్రవ్విపోసిన వినాశముగాను నిజంబు కేశవా!

కావున ఓనందనందనా! ఎవరో యేమో నన్ను తిట్టినారని నిరసించి నారని శపించినారని యెన్నియో నిర్వచించితివి. కాని,

మ. కవచంబున్ వరకుండలంబులను భిక్షన్ గొంటకై వచ్చి యా
నవనాధీశ్వరుఁ డింద్రుఁ డాఁచికొని మోసంబెంతయో చేసె నా
జవసత్త్వంబులు లాగి యర్జునునిచేఁ జంపింప నూహించు శా
త్రవవర్గంబున నీవు లేవొకో ముకుందా! మాట లింకేటికిన్.

ఇది యటుండనిమ్ము. ఓచక్రి! మహామహనీయమైన నీశక్తి నే నెఱుంగక కాను. కాని నీవు మహోన్నతస్థాన మలంకరించియు సామాన్యమానవునివలె స్వల్పకార్యములకుఁ గడంగి కులక్రమా గత మైన మర్యాదను వదలివేయు చున్నాఁడవు.

కృ—అదియేమి.

కర్ణు—ఏమా! నాఁడు రాజసూయమునకు వచ్చిన ఛప్పన్న దేశాధీశుల మధ్య మహామహుఁడైన భీష్ముఁడు ఎవని కగ్రతాంబూల మిచ్చినాఁడో ఎవరు నరకాసురాది మహావీరాధిపీరులను నిర్జించి కీర్తిన్నికఁ గాంచినాఁడో అట్టి నీవు పాండవదౌత్యమునకు కుదిరి

తివి. మున్ముందు సానిధ్యముకూడ సేయుదువేమో! చూడుము.

ఉ. జ్యూతపణంబునఁ శకుని నుంచి సుయోధనుఁ డాత్మగౌరవ
ఖ్యాతిని నిల్పి పాండవుల గర్వమణంచెను ధర్మసూతియా
నీతియెఱుంగకోకితవునింబలె పన్నిదమొడ్డి రాజ్యమున్
నాతిని యోడిపోయెను జనంబు లిసీయని నిందలాడఁగన్.

కృ—నీసంగతి చెప్పవేమి? నీప్రభువు

తే. గీ. దానకర్ణుఁడనుచు నిన్ను ధరణిఁ బిలువ
విని సహింపక యలిగి యాపేరు తనకె
కలుగవలెనని వాకిట గంటకట్టి
దాత దుర్యోధనుండు కాఁ దలఁచినాఁడు.

కర్ణ—(పై పద్యము చదివి) ఇందు తప్పేమున్నది?

ఉ. దాతలు పెక్కు రున్న మన ధాత్రికి శ్రేయమెగాని హానియున్
భీతి యొనంగి చింతయును పేరునకో సుకృతాప్తికో జన
వ్రాఁత వశీకరంబునకొ న్యర్థపు డంబములాడికొంటకో
దాతలు గల్గనిమ్ము విధిధర్మము లొక్కనికాణయాచితో.

విదు—అగునది నిక్కము.

కర్ణ—మీయర్జునుఁడుగూడ ధనదాత కాఁదలంచినాఁడు.

తే. గీ. నీవు ఋణముజేసి నీపార్థునకు నిచ్చి
పంచినావు పేదబ్రాహ్మణాలకు
ఇనుఁడు జలములాఁగి యిందుని పేరవ
ర్షింపఁజేసి నదులు నింపినట్లు.

కృష్ణ—కర్ణా! నేనొక్కమాట చెప్పెదను ననహింకుఁడవై యాలింపుము.

కర్ణ—అవస్యము అది ఏమి?

కృ—నీజన్మవృత్తాంతము, నీవు సూర్యునివలనఁ గుంతికిఁ బుట్టితివి.

కర్ణ—కావచ్చును.

కృ—కుంతి తన కన్యాత్వము గాఁదిపుచ్చుటకై నిన్నొకపెట్టెలోఁ బెట్టి నదిలో విడిచివైచినది. అది ప్రవాహవేగమునఁ గొట్టుకొనిపోయి రాధాధవునకు దొరికినది. నిన్ను గాంచి వారు పెంచినారు.

కర్ణ—సరే. ఇంక నేను చేయవలసినదేమి ?

కృ—కుంతీదేవిని నీవు తల్లిగా భావింపవలయును.

కర్ణ—కృష్ణా ! ఇది మిక్కిలి యాశ్చర్యమైనసంగతి.

ఉ. కుంతికిఁ బుట్టినన్ మఱికకుంతికిఁ బుట్టినఁ బుట్టనిమ్ము నే
యింతికొ మానవుండు జనియించుట తథ్యము నాకు దానికై
వంత యొకింతలేదు బలవంతముగా నిది తల్లియంచు నీ
వింతగఁ జెప్పనేల పెఱయింతులు తల్లులుగారె మాధవా !

కృ—కర్ణా ! అది సరే! పెరయింతులు పరధనములసంగతికై నిన్ను నేను బిలువలేదు. కుంతి నీతల్లి యనురహస్యము నీతోఁజెప్పి మీచుట్టఱికము అశిథిలానురాగ సముత్సుకసువర్ణశృంఖలములతో బంధించవలయు నని నాసంకల్పము.

కర్ణ—నీపవిత్రమైన మహదాశయము మిక్కిలి సంస్తవనీయము కాని కృష్ణా ! ఒక్కసంగతి చెప్పెదము.

ఉ. పిల్లలఁగాంచి నీటఁబడవేసిన భీష్మునితల్లిరెండు నా
తల్లి దయావిహీనలని ధాత్రి నిదుర్యశమందినారు ప్రే
పల్లెకు నీదు తల్లి నిను బంపి యశంబును గాంచెఁగాదె వీ
రెల్లరు కాలగర్భమున కేగెద్దరెన చరిత్ర లేగునే.

కుంతి—(ప్రవేశించును.) నేను మంచిసమయమునకే వచ్చితిని.

(అందఱు లేచి నిలువఁబడుదురు.)

కుం—నాయనా ! కర్ణా ! సహజమైన కవచకుండలము లిచ్చివేసి నీవు

నేఁడు మిగుల దిన్నవోయియున్నాఁడవు.

కర్ణ—లేదు నామనస్సు మిగుల తేజస్సుతో నిండియున్నది.

కుం—నీవు శ్రీకృష్ణభగవానునిమాట లెంతమాత్రమును తిరస్కరింపకుము. వేదవాక్యములవలె శిరసావహించి యాచరించుముతండ్రీ! సర్వశుభములను పొంది వర్థిల్లఁగలవు.

కృ—నీవు పాండవపక్షమున కరుదెమ్ము. నీకు ధర్మరాజుచేతను తక్కిన నలువురన్నదమ్ములచేతను సకలోపచారములు చేయించెదను. మఱియు నోకర్ణా! పాండవపంచకముచే నిన్నగ్రజన్మునిగాఁ బూజింపనేయుటయే గాదు.

ఆ. గీ. ఎవతెకొఱకు మీర లీనేమిలోకంబు
లేదుగావటంచు నెంచినాఁడొ
అట్టి ద్రుపదుపట్టి నాలిగా నీకిత్తు
నింకఁ గోరఁదగినదేది కర్ణ!

కర్ణు—మాధవా! ద్రుపదపుత్రియగు కృష్ణను సుయోధనునివంటి మహారాజును ఋత్విక్వాసికొడుకని నధిక్షేపించినయాజ్ఞసేనిని నాకాలిగా నమ్మించెదవా! నీవెంతటికైన సమర్థుఁడవే కాని కృష్ణా!

మ. పరకాంతన్ జననీసమానయని నే భావింతు పాంచాలి బం
గరుపాంచాలిక సుందరాంగియయినన్ గానచ్చు లోకాన నెం
దఱు సౌందర్యవిరాజమానలగు కాంతల్ లేరు వారెల్ల వ
త్తురె కాంక్షించిన నన్యకాంతలరతుల్ దోషంబు గాకుండునే.

కృ—సరే కర్ణా! నేనెందు కీసంగతి నీకింత స్పష్టముగా వివరముగా నొడివితినో దూరమాలోచింపుము. రథకారకుల సంజాతుఁ డనుమహాకళంకము సంపూర్ణముగాఁ దొలఁగిపోవుటయేకాక సర్వసర్వంసహాచక్రమేకఛత్రముగా పాండవులఁగూడి పరిపాలింపఁగలవు

నీయశము భారతజాతీయగీతములలోఁ గలిసి గానము సేయఁబడును.

ఉ. ఈమహానీయబాంధవము నీయవకాశము పోవనీయకా
కామిని కృష్ణ నీకు నిజకామినియౌను సముద్రముద్రితం
బౌ మహిఁజిక్కు నీ కరతలామలకంబుగ పిపిగొంట రా
వేమి సుయోధనున్ విడువవేమి శుభంబులు మానుకొందువే.

కర్ణ—కృష్ణా! యిదియెంతమాత్రము సరిపడనివాని.

సీ. పాండుపంచకమని ప్రఖ్యాతిగాంచువా
రలలోనకా నీసుఁడలర లేఁడు
నేఁటివాఁకను సూతవాటిలోఁ బెరిఁగిన
రాధేయుఁ డిపు డొక్క రాజు గాఁడు
ఒక పేద శూద్ర కన్యక భర్తయగు కర్ణుఁ
డల ద్రౌపదికి భర్త యనఁగఁబోఁడు
దుర్యోధనుని మైత్రి త్రోసి రాజని మీకు
దోసిలొగ్గ శ్రవుండు ద్రోహి గాఁడు

తే. గీ. బలమునకు బెగ్గడిలి మీకు వశము గాఁడు
సొమ్ములకు లొంగి మీకు దాసోహమనఁడు
చానలను గోరి మీకు కై చాపులిడఁడు
ఇన తనూజుండు కురు సుయోధన సఖుండు.

కుంతి—నాయనా కర్ణా! గతమంతయు మఱచి సాక్షాద్విష్ణు స్వరూపుఁడైన మాధవుని నుడువు లాలకించి పాండు నందనులను నీవు సముద్ధరింపుము. తండ్రీ! చిరంజీవివై సుఖపడియెదవు.

కర్ణ—ఈ నూతిన సృష్టియు నీ నూతన మర్యాదలును నడుమంత్రపు కలిమి. జనాపవాదమునకుఁ గారణము. అసహ్యము, తుచ్ఛము, సర్వాత్మనా నాకనగత్యము.

విదు—కర్ణా! సకలధర్మవిదులైన పెద్దలమాటలు తృణప్రాయములుగాఁ
ద్రోసివేయఁ జనదు. అందులో తల్లి, పూజ్యురాలైన గొంతి
ఆమె కోర్కెనైనఁ జెల్లింపుము.

కర్ణు—అమ్మా.

సీ. సూర్యు నంతటివాని సూనుఁ డంచెఱిఁగియు
కృపమాలి గంగ కర్పించినావు
చిరకాలమై పాసి చిత్తంబులో రోసి
మరణించెనని కర్ణు మఱచినావు
సూతుని సుతుఁడనై సూతకన్యను గూడి
కాపురంబును సేయఁ గాంచినావు
పాండు నిల్లాలివై పడసిన పుత్రుల
గెలిపింపఁ నన్నోడింపఁ దలఁచినావు

తే. గీ. నిజముగా నన్ను తొమ్మిది నెలలు మోసి
కాంచియుండిన నా స్థితి గాంచి నీవు
కడుపు చుమ్మలు చుట్టుక పడకయున్నె
తల్లి గొంతెమ్మ కోర్కెలు జెల్లునమ్మ.

కుంతి—(తలవంచి) నిజము కుమారా! నిజము నీమొక నేను రాతికంటె
కఠినురాల ననుటలో నతిశయోక్తి లేదు కాని—

ఉ. పార్థుఁడు గాని పాండుసుత పంచకమం దెవరైన నీకు ప్ర
త్యర్థులు గారు ద్రౌపది వతంబును నిన్ మది గోరుచుండు నే
నర్థి దలంతు నీ శుభమహార్హిక మీస్వకుటుంబ మావదన్
వార్థిని ముగ్గిపోఁగనెదవా! కరుణింపవ! చిన్ని తమ్ములన్.

కర్ణు—అమ్మా! ఇది నాస్వకుటుంబమా! వారు నా తమ్ములా! అగుగాక.

శా. ఏనో పార్థుఁడొ వీరలోకమున మున్నే నిల్చి ప్రత్యర్థులై
ప్రాణాలొడ్డి రణంబు సేయుటకునై బాసాడి యున్నాము నీ

వానాఁ డేమయినావు ద్రౌపది వివాహార్థంబు నేతెంచునాఁ
డే నన్ బిల్చిన నింత పుట్టునె తల్లి మాట లింకేటికిన్.

కృ—(తలవంకించి) అగుననుము కాని కానీనా.

ఉ. పార్థుని గెల్వలేవు బలవంతుఁడవైనను నీవు కర్ణ యీ
వార్థులు ముంచవచ్చినను వాసుకి కోరలు విప్పివచ్చినన్
స్వర్ధుని నెత్తిపైఁబడిన చండవాయుతాశనుఁ డెత్తి వచ్చినన్
వ్యర్థము పార్థుజంపఁగలవారు త్రినేత్రుల లేరు జూడగన్.

కర్ణ—మాధవా! ఈబీరములకేమి పార్థునిపేరు వీరలోకమునకన్న నారీ లోకమున విశేష విఖ్యాతిగాంచియున్నది.

చ. అతివ నటంచు పేరున బృహన్నలనంచును వేశ్యశావ సం
హాతమతినంచు బొంకి విరటాధిపు నంతిపురంబు జేరి యా
యతివలతోఁడ నాట్యములఁ నాడుచు పాడుచు వారిగౌరవ
ప్రతితిని పాడుజేసినది పార్థుఁడె కాదొకో నందనందనా!

కృ—కర్ణా! నీవల్లిన్నటికిని భావింపకుము. నిజముగా అర్జునుఁడు శాప హాతుఁడగుటచేతనె విరటుని మందిరమున నాడుదానివలె నటించినాఁడు కాని అంతమాత్రమున వీరుఁడు కాఁడనఁ జెల్లునా?

ఉ. సర్వధనుష్కళావిదుఁడు శౌర్యధనుండల కాలకేయులన్.
గర్వమణంచినాఁడు దివి ఖాండవమున్ దహియించినాఁడు గం
ధర్వులఁ ద్రోలినాఁడు కురుధాత్రిపతిన్ విడిపించినాఁడు ఆ
శర్వుని గెల్చినాఁడు నరుసాటి నరుం డిలఁ గల్గనేర్చునే.

కర్ణ—అగునగును. నరుసాటి నరుం డుండఁడు కాని కృష్ణా!

ఉ. శర్వుని గెల్చుటన్న దొక సాహసమా? యతడల్గివచ్చినన్
సర్వజగంబులున్ గుసుమ సాయకుఁడున్ ద్రిపురాసురావళుల్
బుర్వుల లీలమాడి పడిపోయిరి యర్జునుఁడేమి లెక్కయా
పార్వతి ముద్దుదీర్పఁ దన పాశుపతంబిడఁగాదె వానికిన్.

కృష్ణు—కర్ణా! నీ సమయానులాపంబుల కెంతయు సంతసింపవలసియు న్నది కాని మొన్న మొన్నను జరిగిన గోగ్రహణమునాఁటి ముచ్చట లప్పుడే మఱచితివా?

కర్ణు—అవి ముచ్చటలే మేము గోగ్రహణమును మిషచేవచ్చి పాండవు లజ్ఞాతవాస వ్రతభంగమును గావించితి మదే మావిజయము. ఈశ్వరుని గెల్చుట యెట్టిదో అర్జునుఁడు మమ్ము గెలుచుటయు నట్టిదే.

కృష్ణు—

తే. గీ. మత్స్యయంత్రంబు తెగటార్చి మరలునపుడు
చెలఁగి కేళీ రణంబులు సేయునపుడు
పరఁగ గోగ్రహణార్థమై వచ్చునపుడు
అర్జును నెఱింగి పోరపడ నగునె చెపుమ!

కర్ణు—కృష్ణా! మేము పొరపడుటలేదు అపవి నీది.

మ. గయునిన్ నీవు శపింపఁ బార్థుఁడు భుజంగంబుల్ నిన్ మాన్పఁగన్
గయుపక్షంబున నిల్చె పాండవులసఖ్యం బిట్టిదే చక్రధరుమా
నయహీనాత్ములో మేము శత్రులము కృష్ణా నీకు, నూహించు, నీ
భయముల్ గల్గియె వీడినామడవులన్ బ్రాణాలతో వారలన్.

విదు—ఈవాదము లస్తినాస్తికములవలె ననంతములైనవి.

తే. గీ. హితములాడియాడి యిది నీకు కర్తవ్య
మనుచు జెప్పఁ గృష్ణుఁ డంతవాఁడు
తల్లి కుంతి చెప్పె తగనే వచించితి
కాని వినవు మూర్ఖగతిని కర్ణ.

కర్ణు—తాతా!

ఉ. నీతికి నీవు పేర్వడిన నేతవు నీదు మతింబు లోకవి
ఖ్యాతము చెల్లరే విదుర కౌరవులన్ విడనాడు మంచునే
రీతిని చెప్పఁగాఁగలవు కృష్ణుఁడు చెప్పినఁ జెప్పరాక నా
యాతనఁ బున్నదాఁక భజియించు కృతఘ్నుఁడనగాను జేసితే.

కుంతి—నాయనా! నామాట యేమి చెప్పెదవు? నేను నీకు తల్లిని నా యేవురు కొడుకులను నాలములోఁ బట్టి చంపనని వరమిచ్చి నా ఋణము దీర్చుము నేఁడే నిన్ను కౌఁగిలిఁబట్టియాచి చుచున్నాను. పుత్రా కర్ణా! నన్ను దుఃఖార్ణవమున ముంచఁబోకుము. నీకు నేను నిజముగా తల్లిని.

విదు—

తే. గీ. కవచకుండలములఁ గాదన కిచ్చితి
వర్థికపుడు తల్లి ననుచు వచ్చి
చేరె యామెకోర్కె చెల్లింపఁగా రాదె
లేదె దానపదము నీదె కాదె.

కర్ణు—

ఉ. తల్లివొ కావొ నే నెఱుఁగ దైవ మెఱుంగునుగాని నీవు నా
తల్లివటంచు జెప్పితివి ధన్యుఁడనైతిని నిప్పుడీవు నా
వల్ల ఋణంబు దీర్చుకొన వచ్చినదానవు గాన నర్జునుం
డల్లన మానినీ కొడుకు లందఱి వీడెద నాజిలోపలన్.

(అని నిష్క్రమించును.)

కృ—మన మింక సంపూర్ణకృతార్థులమైనారము. మనకోరింతలన్నియు దీరినవి.

విదు—అదియెట్లు? అర్జునుని తెగటార్చెదనన్న కర్ణునివాక్య మమోఘము కాదా!

కుం——నాయర్జునుఁడే తెగిన నాకిఁక లోకమే లేదు. (అని మూర్ఛిల్లును.)

విదు——అర్జునుఁడు లేని పాండవులు శిరములేని మొండెములు.

కృ——అగునది వాస్తవము. అర్జునుని నేను కాపాడెదను. తక్కిన పాండవ చతుష్టయమును కర్ణుఁడే విడిచివేయును అది మనకు మేలుకాదా? మఱియు నోమామా!

చ. ఎవనిశుభంబు గోరుచును నీవిధివాదము జేసినాఁడొ ఆ
యవనిధవున్ సుయోధనుయమాలయమంపెడు భీముపిడి కౌ
రవకులమార్చెకర్ణుఁడు శరంబుల మిత్రుని సాకఁబోయి శా
త్రవులకుఁ దోడ్పడెన్ విధివిధానమలంఘ్యము నిట్టివారికిన్.

(తెరదిగును.)

# మహాభారతకౌరవరంగము

## చతుర్థాంకము.

రంగము—కురుక్షేత్రము.

(కౌరవపాండవసేనామధ్యరంగమున కృష్ణార్జునులు
రథమెక్కి ప్రవేశింతురు.)

కృ—అర్జునా! నేడెంత శుభదివసము. ఈపుణ్యక్షేత్రమగు కురుక్షేత్రమున మనసేనయు భీష్మాదిద్రోణాచార్య పరిరక్షితమైన కౌరవసేనయు నెట్లు విరాజిల్లుచున్నదియో చూచితివా! నేఁ డీదుర్యోధనాదులు తా మొనరించిన దుర్నయముల ఫలమనుభవించుటకు సంసిద్ధముగ నున్నారు మఱియు.

ఉ. పాపకళంకమూర్తులపై మసిప్రాఁకినరీతిఁదోఁచ నీ
కాపురుషుల్ రణావనినిఖడ్గములన్ గొనియున్నఁబోరఁగా
నోపరు దుర్మదాంధుల సమున్నతియాఱిపోవు దీ
పాపచయంబువంటిది భయానకమైనది చూడు మర్జునా!

అర్జునా! నీకిచ్చట జయమును శత్రువులైన కౌరవేయులకుఁ బరాజయమును విధిపేరితమైనదని నీవు తెలిసికొనుము.

అర్జు—అగునుగాక. కాని.

ఉ. మిత్రులు నన్నదమ్ములు సమీపపుబంధులు మేనమామలున్
బుత్రులు బావమర్దులు ప్రబుద్ధులు తాతలుగ్రాలు నీకురు
క్షేత్రము పెండ్లిపందిరనఁ జెల్లుచునున్నది యిందు వీరి నే
శత్రునికైవడిన్ బిలిచి చంపఁగనేర్తున రక్కసుండనై.

కృ—(స్వ.) ఓహో! ఈతఁడు సమరపరాఙ్ముఖుఁడై మెల్లఁగాఁ బాటి

పోవనుంకించుచున్నట్లున్నది. ఎట్టులో వీనిని దిద్ది యీజైత్రయాత్ర
సాగింపవలయును లేనిచో యీదుష్టసంహారము కానేరదు. (ప్ర)
అర్జునా! ఏమంటివి? (పై పద్యమును జదివి) అనియా ఆహా!
ఆకౌరవులు మీయెడ నొనరించిన మహాపరాధము లప్పుడే మఱ
చితివా?

అర్జు—లేదు కాని.

చ. గతజలసేతుబంధనము గాదె గతించిన మేలుకీళ్లనం
గతి తలపోయనేఁడు మనకాలము చెడ్డదిగాన శత్రులా
గతికి కురించినారు భవకర్మఫలంబులు దప్పవేరికిన్
క్షితి, గతకాలమున్ దిరిగి చేకురునే రిపులాజిగూల్చినన్.

కృ—మీరజ్ఞాతవాసమున నిడుమలఁగుడుచుచున్నను మీవెన్నాడుట
మానకగోగ్రహణమునుమిషచే నెంత కీడాచరింప సమకట్టినారో
యొకసారి తలంచుకొనుము.

అర్జు—అగును.

ఉ. కాలముచెడ్డదైన రిపుకాండములేమి స్వదేహరక్తమే
చాలు విరోధమై వెతలఁ జంపుఁ గిరాతుఁడు లేడినేయ నా
కోలపలాయనంబగుచు కొద్దిగ గాయముజేసెనేని యా
బాలకురంగరక్తమెట పాఱినబోయకు దారిజూపదే!

అట్లే మేము మాదుర్దినములలో దుఃఖము లనుభవించినాము.

కృ—ఇప్పు డవి తీరినవా?

అర్జు—తీరకపోయినను నేనీబంధువధ మొనరింపనోపను.

సీ. ఈబంధువులఁ జూచి నాబొంది కంపించు
రోమహర్షముపుట్టె నేమి సేతు
గాండీవమీచేతినుండి జారును తను
వ్వుడు కెత్తెనిచట నేనుండలేను

అపశకునము లెన్నో యగుచున్న వీక్ష శ్రేయ
మీ బంధువులఁ జంపి యెటులఁ గొందు
విజయంబు రాజ్యంబు విభవంబు జీవంబు
నాశింప నీవు నేమన్నఁ గాని
కర్ణదుర్యోధనాదులు ఖలులె కాని
వారిఁ జంపినపాపంబె వచ్చుమనకు
వారు మము జంపి ముల్లోకవైభవములఁ
బొందఁగానిమ్ము నాకు నిబ్బంది లేదు.

కృ—ఇట్లని నీవు రణోపసంహారమునకు దారితీసిన నట్టిపై యేయాపదలు పుట్టునో నూహింపకున్నాఁడవు.

ఉ. భీరుఁడు సర్జునుండు రణవీధిఁ దొలంగియు బాఱిపోయె కాం
తారదురంతసీమలకు దారుణ కౌరవవహ్నిదాఁకఁగా
నూరక మాటలే యల సుయోధన భీష్మకకర్ణ దుస్ససే
నా రమణీయమైన కదనంబని లోకులు చెండ నాడరే.

అర్జు—ఆడిన నాడనిమ్ము. కాని యీ యుద్ధమే సాగించిన నెన్ని కుటుంబములు ఎన్ని కులములు నిర్మూలములై నిరాధారములై పోవును.

మ. కుల నాశం బొనరింపరాదు కులసంక్షోభంబు గావింప నా
కులకాంతానిచయంబు భ్రష్టయి శుచిగ్ గోల్పోవు దుశ్శీలమై
కులమున్ సంకరమౌను; సంకరులు మూర్ఖుల్ కర్మముల్ సేయకే
ఖలులై పోదురు వారితో మనకు దుఃఖవాప్తి చేకూరెదున్.

(అని చతికిలఁబడును.)

కృష్ణు—

ఉ. చాలును జాలు నీవగవు జాలు గ్రహింపఁగనయ్యె నీకు నే
లీల జనించె తుచ్ఛము మదీవ సమా క్షమయేచ్ఛ మోహమా

భీ:మనార్య సేవితము భీరువుఁబోలె దురంబు మానెదే
చాలును లెమ్ము యుద్ధమును సల్పుము భారతకీర్తి నిల్పుమా.

అర్జు—కృష్ణా! నన్నేల యీ యడియాసలకు దింపెదవు?

ఉ. ఉత్తములైన భీష్మగురుయోధుల యుద్ధములోనఁజంపి యా
నెత్తురుఁగూడునుం గుడువ నేనిఁక భిక్షమునెత్తి కాలమున్
బుత్తును నోడు గెల్పు లెటుబోవునొ తెల్పఁగరాదు శాంతిరే
కెత్తఁగ దారిజూపు మది యింద్రపదంబునకంటె మేలగున్.

కృష్ణు—

తే. గీ. పండితునిభంగి నీతులు పలికెదీవు
వగవఁ బనిలేనివారికై వగచెదేల
బ్రితికి యుండినఁ జచ్చిన వారికొఱకు
వగవ నొల్లరు పండితవర్యు లెపుడు.

ఉ. ఏ సవినాశనుండ నటు నీవును నాశములేనివాఁడవే
యీనృపు లెల్ల నిత్యులు నశించిన దేహము నాత్మనిత్యమే
కాన గళత్ జరామరణకారణమైన యవస్థలన్ని యీ
మేనికగాని యాత్మను గమింపవు దానికి దుఃఖమేటికిన్.

సీ. బాల్యకౌమారయౌవనము లట్టులఁ బున
ర్జన్మ వచ్చును జీవజాలములకు
శీతోష్ణ సుఖదుఃఖ భీతుఁడవైపోక
యోగివాని నన్నిటి నోర్చుకొనుచు
ఆత్మ నిత్యంబు దేహం బనిత్యంబను
సదసద్వస్తు దార్థ విజ్ఞాన మెఱిఁగి
పుట్టని చావని పొంతఁబోవని యాత్మ
చావదు చంప దేసమయమందు

తే. గీ. జీర్ణవసనంబు విడిచి మంచిదియు నూత్న
వస్త్రమును గట్టునట్టు లీయాత్మ ప్రాణి
దేహమును వీడి కొను క్రొత్తదేహమునను
గాన దీనికై వగచుట మాను మింక.

మఱియు నో కౌంతేయా.

ఉ. అచ్చపు ధర్మదీక్షను దురాత్ములఁ జంపఁగఁబోయి నాజిలోఁ
జచ్చిన వచ్చు స్వర్గము నిజంబుగ గెల్చిన రాజ్యభోగముల్
వచ్చును గాన లెమ్ము మఱి పాపముబొందవు కర్మయోగ సం
పచ్చయమెల్లఁ జెప్పెదను బంధవిముక్తికి నాత్మశాంతికిన్.

సీ. మునుసూర్యునకు నేను వినిపించితిని దీని
నినుఁడు వైవస్వత మనువునకును
బోధించె నతఁడు సంబోధించి యిక్ష్వాకు
నకు నెఱిఁగించె తత్సకలమతఁడు
ఋషు లందరికిఁ దెల్పె యీరేడు లోకాలు
తెరియింపఁజేసెనా తత్వ మిపుడు
నీకు వెండియుఁ జెప్ప నిశ్చయించితి పార్థ
అవహితుండవై విను మావిధంబు

తే. గీ. అగ్నికట్టెలఁబడి కాల్చునట్లు కర్మ
లన్ని జ్ఞానాగ్నిలోఁబడి యంతరించు
నపుడు నగుపడు జగము నీయందు నట్టి
నీవు నాయందు నన్ను వీక్షించఁగలవు.

అర్జు—

తే. గీ. నీవు మొనమొన్న దేవకీదేవి గర్భ
శుక్తి ముక్తాఫలంబయి శోభఁగాంచఁ

గాంచఁబడితివి తరణి కేకరణి తత్వ
బోధఁజేసితివో నాకు బోధపడదు.

కృ—ధనంజయా! నే నవినాశనుఁడను.

మ. ఒకమారీ నిఖిలప్రపంచ నిజసృష్ట్యుద్దేశమర్థించి యా
దకలంకప్రతిభావిభానమును దివ్యానంతతేజః ప్రపం
చకళానంద రసస్వరూపమును లక్ష్యంబందు వీక్షించినన్
వికలం బందని నన్ను జూడగలవో విశ్వాకృతిన్ భారతా.

శా. స్వాతంత్ర్యంబు నిజానురాగము ముముక్షుత్వంబు బంధంబు వి
ద్యాతత్త్వంబున నిల్పఁబూనిన నిధి ధ్యానంబులో దృశ్యమై
పాతాళంబుల మెట్టి పైకెగసి దివ్యద్యోధు నీనాక సం
ఘాతంబున్ బెకలించు నే ననము యోగజ్ఞాన మార్జింపుమీ.

ఉ. మానవశక్తి మానసిక మార్గణముల్ వెలిజిమ్మి యాత్మని
జ్ఞానముచేత సృష్టిని ప్రకంపితమున్ బొనరించి యాతమిస్
భానుసహస్రమండలము భాతి వెలింగెదు నన్నుఁజూచి దృక్
స్థానము మార్చుకొమ్ము జడసంస్మృతిబోయి సుఖంతు వర్జునా.

ఉ. జ్ఞానవిధానసిద్ధి నిజ సంస్కరణంబులఁ బొందనెంచు వి
జ్ఞానులు మానవత్వము ప్రజాప్రతిపాదక వామమార్గముల్
మాని స్వరూపనాశనము మాటున దాఁగిన జీవశక్తిలో
గానఁగవచ్చు నీశ్వరుసిగాఁ గనుచుందురు నన్ను భారతా!

శా. నీకున్ జ్ఞాపక ముండవచ్చు విశిఖానీకంబు వర్షించి ము
ల్లోకంబుల్ తెగమాద్చునాఁడు దనుజుల్ బుత్తెంచి విశ్వంబుదా
మాకర్షించెదునాఁడుకాలయవనుల్ మార్కొన్నయుద్ధాల నే
నైకావర్ణ సచరాచరంబయిన బ్రహ్మాండంబు రూపించెదున్.

ఉ. ధారణఁజేసి మృత్యువును దన్నిజితేంద్రియులై శరీరసం
స్కారవికార వీచికల సంగతిఁబోక నిజాత్మతత్త్వ వి
స్తారతమోవిధూత వివిధప్రతిపాదకమైన సేవ మె
వ్వారు గ్రహింతురో యదియె స్వర్గము నేనని జూడు మర్జునా.

ఉ. ఆటల నాడుచున్న పరమాణువులన్ విడఁదీసి వాసిగో
మూటయియున్న యా వెలుఁగుమధ్య సుధామధురంబులై జగ
న్నాటక సూత్రధారినగు నా నిజరూపము జూపుచుఁ సదా
పాటలుపాడు నా మురళివంకను జూడఁగలేదె యర్జునా?

ఉ. ఆయమునానదీ పరిసరావనివేణువు బూని యాసుధా
మేయమనోజ్ఞ గానరవ మిశ్రితగీతములేవి పాడినా
నో యవి నేఁడనంతము మనోహరరాగరసంబులో నుపా
ధ్యాయునిరీతి గీత నమృతాకృతి జెప్పితి న న్నెఱుంగగన్.

ఉ. ఆలము శత్రుభంజన మహామహితాత్మకమై ప్రభాతతే
జోలసితప్రభాపటలశోభిత సృష్టి విలాస విహ్వలో
ద్వేల నిగూఢతత్త్వ నిజదీప్తివినూత్నతఁ దెచ్చిపెట్టు నీ
కాలము వచ్చునే విరిగి గాంచెదమేమన మెన్నఁడేనియున్.

సీ. దివ్యులమెప్పించి దివ్యావగనుబట్టి
దివినుండి నేలకు దింపునాఁడు
రక్కసులనుబోర రక్తముల్ పాఱించి
శరవాహినుల మ్రోలఁ బెరుఁగునాఁడు
సామగానంబులు సవనంబు లొనరించి
సృష్టికిఁ బ్రతిసృష్టి సేయునాఁడు
భూమి చాఁపఁగఁజుట్టి నామావశేషంబు
జేయవచ్చినవారి జేల్చునాఁడు

తే. గీ. భారతీయ యశఃకాంత వర్ణితగీతి
కలను దిక్కుంభికుంభాల నిలిచిపాడ
నాఁటి జాతీయకీర్తియే నాఁటికైన
మఱవఁగారాదు, అర్జునా! వెఱువవలదు.

అర్జు—

శా. నీమాయార్ణవ మెంత లోఁతు గలదో నీతేజ మేలాటిదో
ఏమో నీ నిజరూప మేవిధమునన్ వీక్షింపఁగా వచ్చునో
ఏమార్గంబున నిన్ను జేరఁ గలమో యెవ్వారెఱింగింతు రీ
భూమాతీతలసత్కళాకలిత దివ్యోదంచితా అచ్యుతా!

కృ—అదిగో చూడుము నా విశ్వరూపము (అనిచూపును.)

అర్జు—(చేతులు మోడ్చి)

దండకము.

నమో దేవదేవా నమో సర్వలోకేశ సర్వప్రకాశ భవద్విశ్వరూపం బవాచ్యం బచింత్యం బనంతం బవాఙ్మానసం బప్రమేయం బనూహ్యం బసత్ చిత్ స్వరూపంబునై లోకమై భూతకోటిన్ విడంబించి దీపించు నిన్నెంచ నేనెంతవాఁడన్ భువర్లోకముల్ స్వర్గపాతాళముల్ జీవజాలం బులున్ సర్వతేజః ప్రపంచంబ విచ్ఛిన్న నిర్వార గాఢాంధకారంబు నీలోన నిండారి నీగర్భ భాండంబులోనుండి రూపించు ఈ కౌరవశ్రేణి కాలాహి కంఠంబులోఁజిక్కి మాంపాహి పాహీ యటంచుల్ నశించున్ మహాఘోర మీదారి యీసారి వారించి నన్నున్ ప్రసాదించి రక్షించవే దేవదేవా నమస్తే నమస్తే నమః.

(తెరపడును.)

# మహాభారత కౌరవరంగము.

## పంచమాంకము.

---o---

రంగము—కురుక్షేత్రయుద్ధభూమి.

(భీష్ముఁ డంపశయ్యపై పరుండియుండును.

(పాండవులు విదురుఁడుచుట్టును గూర్చుండియుందురు.)

(కర్ణ దుర్యోధనులు ప్రవేశింతురు.)

కర్ణు—ఓసుయోధనమహారాజా! మీకురుకులపితామహుండైన భీష్ముఁ డొనరించిన కృతఘ్నత వింటివిగదా?

దు—వినుటయేగాదు కన్నులారఁ జూచితిని.

కర్ణు—ఈగాంగేయు నిఁక యుద్ధము మాన్పించవలసినదని నే నెంతచెప్పినను వింటివికావుగదా!

దు—

చ. పదిదినముల్ మహాహవము పాండవవర్గముతోడఁ బోరి యా
తుదిదినమున్ శిఖండి గని తోడనె విల్లును బాఱవేసి యా
నదిసుతుఁడుం గృతఘ్నత నొనర్చెఁ బరాజయ మింక మాకు త
ప్పదు; తనపిల్లలన్ జననిభక్షణఁజేసిన లోకమాగునే.

కర్ణు—నిజము. ఈతనితల్లి గంగ ఏడ్గురుసుతులను గాంచి కాంచిన తోడనే చంపి గంగలోఁ గలిపినది. చావు దప్పి కన్నులు లొట్టవోయినట్లు నీతఁ డెట్లో బ్రతికి పైకిఁబడినాఁడు. కాని శాంతను రాలిపుత్రుఁడు వంశాంతకుఁ డగుననుట వింత గాదు.

ఉ. కాదనలేరు భీష్ముఁడన కౌరవలోకపితామహుండు వి
ద్యాదయితుండు శూరుఁడుగదా! తను నమ్మినవారి వంశమున్

